# శ్రీ వేంకటేశ్వర కృతిరత్నమాల



రచన

**ఆచార్య వెల్లంకి ఉమాకాంత శాస్త్రి**

*Professor (Retd. from I.I.T., Kharagpur)*

19-88/36, Prashant Nagar,

Ecil Post, Hyderabad - 500 062,

Ph. No. (040) 7125893.



This Book is published with the Financial Assistance of Sri Tirumala Tirupati Devasthanams under their Scheme

**"Aid to publish Religious Books"**

# SRI VENKATESWARA KRITIRATNAMALA

*By Dr. Vellanki. Umakanta Sastry*

ప్రతులు : 1000



వెల : రు. 20/- U.S.A. 5 dollars

ముఖచిత్రం :

N. Karunakar, B.Sc., B.F.A., P.G.D.
Artist, Visual Lines
6-3-668/15/4, Panjagutta
Opposite to Kanti Sikara Apts.
Hyderabad - 500 082
Ph : Office : 3325704, Res : 375683

ప్రతులకు :

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
4-1-435, విజ్ఞాన భవన్, బాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001.
మరియు విశాలాంధ్ర బుక్‌హౌస్ హైదరాబాద్, విజయవాడ, విశాఖపట్టణం, గుంటూరు, తిరుపతి, హనుమకొండ, అనంతపురం, కాకినాడ.

ముద్రణ :

**Kalajyothi Process Limited,**
1-1-60/5, Iftekar Mansion Lane,
R.T.C. X Roads, Musheerabad,
Hyderabad - 500 020, A.P.
Ph : 91-40-7645536.

# అంకితం

ఈ కావ్యాన్ని శ్రీలక్ష్మి దేవికి, శ్రీ అలమేలు మంగకు
శ్రీ వేంకటేశ్వరునకు కానుకగా సమర్పిస్తున్నాను.

ఆశ్రితాభయ దాతారం శ్రీరమా హృదయేశ్వరం
అలమేలు మంగానాథం వేంకటేశం భజామ్యహం

# నా మనసులోని మాట

ఎందరో మహానుభావులు తమ గేయకవితా రచనతో ఆంధ్రసాహితీ లోకాన్ని సుసంపన్నం చేశారు. జన జీవితాన్ని ఆనందమయం చేశారు. వారిలో ముఖ్యులు అన్నమయ్య, త్యాగరాజు, క్షేత్రయ్య, రామదాసు, నారాయణ తీర్థులు. ఎవరి మాట వారిది, ఎవరి పాట వారిది, ఎవరి బాట వారిది. కానీ అందరూ ఆరాధించింది ఆ పరమాత్మనే.

సాహిత్యము, సంగీతము, భక్తి ఈ మూడూ ఒక త్రివేణీ సంగమం. మనస్సులో జనించే మధురమైన భావాలను, గుండెలో నుండీ పొంగి వచ్చే భక్తి రస గంగతో మేళవించి, పరమేశ్వరుని లీలలకు నాద బ్రహ్మానంద సంధానమైన అక్షర రూపాన్ని కల్పించటమే ఈ విధమైన గేయ కవిత పరమార్థం.

భక్తికి ఆలంబనం పరమాత్మ. సకల సృష్టికీ ఆధారం పరమాత్మే! నా ప్రయత్నం ఉడుత భక్తి లాంటిది. నేను విరచించిన ఈ మధుర గేయాలు సహృదయులు మనసులను రంజింప జేస్తాయని ఆశిస్తున్నాను. చదవండి, పాడండి ఆనందించండి.

ఈ గ్రంథాన్ని రూపొందించడంలో సహకరించిన వారందరికీ నా అభినందనలు.

ఖర్గపూర్ వెల్లంకి ఉమాకాంత శాస్త్రి
1.7.1997.

# కృతుల సూచిక

28. ఏమి చోద్యమిది ఏమి చోద్యమిది
29. కొలువై యున్నాడు శ్రీ వేంకటేశుడు
30. ఎంత చక్కని వాడే మా వేంకటేశుడు
31. అన్ని మంత్రముల మించిన మంత్రము
32. మేలుకో తిరుమల మందిరాంతర వాస
33. సప్త గిరులపై వెలసిన స్వామికి
34. హరి నామమె మధురామృతము
35. గోవిందా హరి గోవిందా
36. ఎందుల కయ్యా నీవు సృజించిన
37. మేలుకోరా స్వామి మేలుకోరా హరీ
38. ఎంతటి బ్రహ్మానందము రా
39. కనుల నిన్ను కనుగొన్న యంతనే
40. వనధి లో అలలపై వటపత్ర డోలలో
41. నిద్దుర పోరా జోలాలి
42. స్వామి వేంకటేశ్వరా
43. తిరుమల గిరిని దిగివచ్చు స్వామి
44. వేదన బాపగ వేగమె రారా
45. భజ గోవిందం భజ వేంకటేశం
46. కంటినిరా నీ మోహన రూపము
47. పరమాత్మా నీ లీలల నెల్లను
48. కన్నులార నీ దివ్య రూపమును
49. వనజ నయన మా యింటికి వచ్చి
50. పరాకేల నయ్య నీకు
51. నిను కనులారా కాంచిన వారలు
52. ధృతి యన్న నీదే ఆకృతి యన్న నీదే
53. కన్నులార శ్రీ వేంటేశుని
54. పదిలపరచు కొననా నాలో
55. ఎంత కరుణ కలదో నీకంటి చూపులో
56. మంగళము శ్రీ హరికి మంగళము సిరికి

శ్రీ గిరిజా తనయం నమామ్యహం
శిరసా మనసా వారం వారం॥

శ్రీ గణనాథం కరిరాజ వదనం
వాగీశాది సురార్చిత చరణం॥

హేరంబం లంబోదర కలితం
ఏకదంతం ఘన వక్ర తుండం
శుక్లాంబర పరిశోభిత రూపం
సుగుణాభరణం విఘ్న వారణం॥

మోదకేక్షు రస ఖాదన లోలం
వేదనాద సమ్ముదిత మానసం
స్కంద పూర్వజం నాగాభరణం
సర్వ విశ్వ నిర్మాణ కారణం॥

సకలాగమ సన్నుత గుణ జాలం
నిఖిల ముని జన కీర్తిత శీలం
కమనీయ ఖండేందు మండిత ఫాలం
కరుణాలవాలం కాంత కవి నుతం॥

చింతయామి శ్రీ గణేశం
సర్వ విఘ్న గణనాశం॥

చింతి తార్థ ఫలదాతం
శ్రీ హిమగిరిజా సుతం॥

ఘనలంబోదర కలితం
గజవక్త్రం ఏకదంతం
సర్పరాజ భూషితం
సకలామర సేవితం॥

మూషిక వాహన ఖేలం
మోదక ఖాదన లోలం
సకల నిగమ నాదామృత
సారానందిత హేలం॥

లలిత లాస్యనాట్యానుమోదం
భయదతాండవ కేళీ వినోదం
సకల శాస్త్ర విద్యా ప్రదాయకం
స్కందాగ్రజం శ్రీ కాంత కవినుతం॥

# శ్రీ వేంకటేశ్వర కృతిరత్నమాల

## 1

శ్రీ శేషా చల సదనా ఆ
శ్రిత జన పావన చరణా॥

వాసవాది సకలామర పూజిత
వారిజ నయనా అంభోధి శయనా॥

నిగమాధార నిఖిల మునిజన
మానస మందిర మందారా
నిర్జితాసుర బృంద ముకుందా
నిత్యానందా హరి గోవిందా॥

ఆర్తి హరణ భువనైక నాయకా
అఖిల లోక సంసృష్టి కారకా
పాహి పాహి శ్రీకాంత కవినుతా
పరమపురుష శ్రీ వేంకటేశ్వరా॥

## 2

వేంకటేశ నీ సాటి
వేరె దైవ మెవరు రా॥

పంకజాస నాది సురులు
భక్తితోడ చేరి కొలుచు॥

సప్తగిరుల పైన వెలసి
సౌరు మీరు సిరితోడ
నిరతము మురిపాల తేలి
కరుణ తోడ మము జూచే॥

అంగన అలమేలు మంగ
మంగళకర మేల మాడ
పొంగి పోయి మా కోర్కెల
మోదముతో తీర్చు దొరా॥

ఒక్కసారి నీ నామము
మక్కువతో సంస్మరించి
తండ్రీ మము కావుమన్న
దయతో కలతలు బాపే॥

కరుణాకర శ్రీనివాస
కరివరదా హరి ముకుంద
సదా కాంత కవి వినుతా
సర్వేశ్వర దేవ దేవ॥

## 3

అడుగడుగో అల్లడుగో ఆ వెంకట గిరి పైన
వెలసియున్న వాడు వేల్పులకు రాయడు॥

అడుగడుగు దండాలకు మురిసి చూచు దేవుడు
అడిగినంత వరములిచ్చు కరుణామయుడు॥

నీలి మేఘ మాలికల పోలు శ్యామలాంగుడు
నీటైన నీరజముల నేలు కనులు గలవాడు
ముసి ముసి నవ్వుల తోడ రాజిల్లు మోమువాడు
భక్తులకు అభయ మొసగి రక్షించు వాడు॥

తళ తళ మని మెరిసిపోవు పసిడిచాయ బట్టగట్టి
కస్తూరి తిరుచూర్ణము రంగరించి బొట్టు పెట్టి
నిడుదైన ఉరముపై తులసి సరములను దాల్చి
చెలువుగా సురలతో కొలువు తీర్చి యున్నాడు॥

మునులు సేయు నిగమనాదములకు పరవశించువాడు
కమ్మనైన గానమునకు కరగిపోవు వాడు
ఈరేడు లోకాల నేలు దేవదేవుడు
శంఖ చక్ర గదా పద్మ సహితుడైన వాడు॥

గోవిందా గోవిందా యని పలికెడు భక్తుల
మధురమైన నాదములకు మనసు పరవశింపగా
కరుణతోడ పొంగాడు కనికరించి చూచాడు
శ్రీకాంత కవి నుతుడు శేషశైల వాసుడు॥

## 4

పిలచిన పలికే దైవము నీవని
తలచితి రా శ్రీ వేంకటేశ్వరా॥

కలతలు మాపి మాపైన దయ జూపి
కనికరమున మమ్మేలరా హరీ॥

వనజనాభ సర్వేశ పరాత్పర
వరముని నికర వందిత పదయుగ
కరుణా సాగర శ్రీ మనోహరా
గరుడ గమన శేషాచల సదనా॥

కుల దైవమయి ఇల వేలుపువై
కోరిన కోర్కెల నొసగే దొరవై
కలియుగ వైకుంఠ మౌ వేంకట గిరి
శిఖరాన నెలకొన్న శ్రీ శ్రీనివాసా॥

ఒక పరి ఒక పరి కన్నెత్తి చూచి
వగపాటు దీర్పగ వేగమె రారా
నమ్మితిరా నీ పాద కంజముల
నన్నేల రా శ్రీ కాంత కవినుతా॥

## 5

హరియూ హరుడు బ్రహ్మము తానై
అన్నిట నున్నది వేంకట పతియే॥

తిరముగ జీవుల అంతరంగమున
దీపమై వెలిగే స్వామి అతండే॥

అందున్న వాడా ఇందున్న వాడా
ఎక్కడరా నీ ఇందిరేశుడు
అని ప్రశ్నించిన దనుజుని ద్రుంచ
స్తంభాన వెలసిన నరసింహుడితడే॥

వడుగుగ వెలసి కడు గడుసరి యై
అడుగులు మూడే దాన మిమ్మని
బలిని చేరి శీర్షాన పాదమిడి
అంత మొందించిన వామను డితడే॥

కలడు కలండను పరమ పురుషుడు
కలడో లేడో అను సందియము
తొలగిన కరిరాజా కరుణ గాచగ
పరువెత్తి వచ్చిన పరమాత్మ యితడే॥

ఎవడడ్డ మై వచ్చు నీ సభలోన
అని విఱ్ఱవీగి వలువ లూడ్చగా
చేయు దుర్యోధను మద మణంచగా
వలువ లొసంగిన వాడితండే॥

అణువు మొదలు బ్రహ్మాండము వరకు
సాకారమై యున్న సచ్చిదానంద
రూపుడితడె వేదాంత వేద్యుడై
అలరెడు శ్రీ కాంత కవి నుతుడితడే॥

## 6

పాహి పాహి వేంకటేశ
భవ భయ నాశా॥

దేహి మే ముదం సకల
దేవ కోటి సేవితా॥

సుగుణాకర శేషాచల
సుందర మందిర వాసా
పరమ పురుష భక్తలోక
పాలక సురలోక భూజ॥

కరుణారస పరిపూరిత
కమల నయన యోగి హృదయ
నిలయా ఆనంద రూప
నిర్మల విజ్ఞాన దీప॥

సామ నిగమ జనిత మధుర
గాన సుధా పాన లోల
గరుడ తురగ కాంత వినుత
కరి వరదా హరి ముకుంద॥

## 7

నను పాలింపగ వేగమె రారా
నళిన నయన శ్రీ వెంకట రమణా॥

తనివి తీర నీ మోహన రూపము
దర్శింప నీరా ఓ పరమేశ్వర॥

మనసున నీ దివ్య కథలూ గాథలు
మాటి మాటికి స్మరియింప నీరా
అనిశము నీ పాద పంకజములను
అర్చింప నీయర జగదోద్ధార॥

గోవింద గోవింద యని నీదు దివ్య
నామము గొంతెత్తి పిలువ నీయరా
ఆనంద మయమైన నీ మందిరమును
కనులార నన్ను చూడ నీయరా॥

అడు గడుగుకు ఒక దండము నీకిడి
ఆనందముతో గళమెత్తి నీ గీత
గానము చేసే భాగ్య మీయరా
కరి రాజ వరదా కాంత కవి నుతా॥

## 8

నారాయణ హరి గోవిందా
నగధర శౌరీ పరమానందా॥

కారుణ్య సాగర జగదాధార
కమలా మనోహర శ్రిత మందార॥

భోగి భోగాగ్ర విలాస నర్తన
కేళీ లోలా మధుర సుధారస
పూరిత వంశీ వాదనా చణా
పురుషోత్తమ శ్రీ వైకుంఠ ధామ॥

అలమేలు మంగా హృదయాంబు జాత
రాజిత శతకోటి మన్మథా కార
సకల సురాసుర వందిత పాద
రాజీవ రాజీవ నయనా దేవా॥

భక్తలోక హృత్పంకజ వాసా
వేదనాద సమ్మోదిత మానస
కాంత కవి మనో భావిత రూప
కలుష హరా శ్రీ వేంకటేశ్వరా॥

# 9

ముద్దులు గులికే నీ రూపమును
మోదము తో నే కంటిని రా హరీ॥

సద్దు సేయక యిల్లిలు దిరుగుచు
చక్కని పాల్వెన్న మీగడ జుర్రె॥

అందెల రవళులు ఘలు ఘల్లు మనగా
కన్నుల కాంతుల వెన్నెల కురియగ
కేకి పింఛము శిరమున నాడగ
యమునా తటిలో నటియించు స్వామీ॥

వేణు నాదమా వేద రవమ్మా
ఎంత తీయగా వినిపించి నావు
పులకించిన నా ఎదలో సుధను
పొంగించినావు బంగారు తండ్రీ॥

సకల జగతి నీలోన దాచుకొని
చక్కనయ్య ఏమేమొ మాయలను
చేసి నన్ను మరపింప జూడకు
శ్రీనివాస శ్రీకాంత కవినుతా॥

## 10

ఇందరు నీకై వేచి యుండగా
ఎందుకు నీవు జాగు సేతువు॥

అందగాడ శ్రీ వేంకట రమణా
ఆశ్రిత జనులను మరచుట తగునా॥

బంగురు రంగు పట్టు దోవతి
కట్టుట లోన కాలము గడిచెనా
తులసి సరమ్ముల శంఖ చక్రముల
తాల్చుట లోన జాలమాయెనా॥

మునులు సురలు నీ మొగసాల జేరి
ముదము తోడ నీ రాకను గోరి
వేచి యుందురని నీ యెదలోన
తోచ దాయనా తోయజ నయనా॥

సుందరి సిరి సతి శృంగారముతో
ప్రొద్దు పోయెనా బుధ జనావనా
అందమైన శ్రీ యలమేలు మంగ
కడ గంటి చూపుల ఒడలు మరచితే॥

లలిత లలిత గీతముల నారదుడు
రమ్యముగా గళమెత్తి పాడుచూ
వీణ మీటు చున్నాడు కొలువుకు
వేగ రారా శ్రీ కాంత కవినుతా॥

## 11

నిప్పు లేక నీర మెటు వేడియౌ
కప్పియున్న తిమిర మెటు వీడురా॥

అప్పా వేంకటేశ హరి నీదు నామ
స్మరణ లేక భవము తరియింప నౌనే॥

ఈమె నాదు దార యిది నా గృహమ్ము
వీరెల్ల నా పరివారము
అనుచు తృప్తి లేక ధనము కోరు నాకు
కనుల కెటుల వెలుగు కనిపించు స్వామీ॥

కామాదు లనెడు చోరు లార్గురు
అంతరంగ మందు దారి కాచి యుండ
నిన్నెన్నడైన నే జూడ గలనే
తండ్రీ నీవు నాపై దయ జూపకున్న॥

మంచి కర్మమనెడు మార్గమ్ము జూపి
ధర్మమనెడు వెలుగు నాలోన నింపి
జగతి మేలు గోరు జనుల తోడ నీదు
సేవ సేయనిమ్ము శ్రీ కాంత వినుత॥

## 12

వేద శాస్త్ర పరమార్థము
విశదముగా తెలుపరా॥

నాద భేద వాదములను
నా తరమా తెలియ స్వామి॥

ఆది దేవ బ్రహ్మ మీవె
అందలి స్వర సంధానము
అంతరార్థ మెఱుక పరచి
అంతరంగమున నిలచి॥

సత్య మహింసయు ధర్మము
జగతికి శ్రేయ మటంచు
తథాగతుడవై వెలసి
తత్వము తెలిపిన స్వామీ॥

జీవునకును దేవునకును
భేదము లేదని తెలిపిన
ఆది శంకరుడు నీకు
ఆత్మీయుడె కాడా॥

ఇట్టి విశ్వరచన చేయ
ఇందరి కానంద మీయ
అందలి విజ్ఞాము నీ
కాధారము కాదా॥

మరల మరల మా కొరకై
ధరలో పలు రూపు లెత్తి
కరుణ తోడ మముగాచెడు
కాంత వినుత వేంకటేశ॥

## 13

చూతము రండీ సుందర రూపుని
వేదాంత వేద్యుని వేంకట నాథుని॥

చేతము ఝల్లన శ్రీవారి పాద
సేవలు మనము చేతము రండీ॥

చక్కని నీరద శ్యామలాంగుడట
చెంపకు చేరెడు కనులున్న వాడట
కోటి మన్మధుల రూపము గలిగి
కొండపైన తా కొలువున్న వాడట॥

తీరైన బంగారు చేలము గట్టి
నొసట కస్తూరి నామము బెట్టి
శంఖ చక్రముల చేతుల బట్టి
వెంకట గిరిపై వెలసి యున్నాడట॥

ముజ్జగములను ఏలు స్వామి యట
ముక్కంటి చేత పూజలందుకొను
దొడ్డ వేల్పట దురితము లెల్లను
బాప జాలెడు పద్మనాభుడట॥

ఉక్కు మీరిన రక్కసులను తన
చక్రము చేత చంపిన వాడట
ధర్మము నిలుప ధరపైన తాను
దశ రూపమ్ములు తాల్చిన వాడట॥

అందరి ఆత్మల లో తానుండి
ఆటాడించెడు ఆటకాడట
సుందరముగ శ్రీకాంత కవిచేత
వినుతింప బడిన వేల్పుల వేల్పట॥

## 14

నెమ్మది నీ పద కమలము లే నెఱ
నమ్మితి రా శ్రీ వేంకటేశ్వరా॥

కమ్మని నీలీల గానము చేసి
తరియింప నీయర ఓ సర్వేశ్వరా॥

మత్స్య రూపమున సోమకు ద్రుంచి
వేదములను రక్షించిన స్వామి
కూర్మ రూపమున కులగిరి మోసి
సురులకు సుధను పంచిన స్వామి॥

మును వరాహమై జలధిని మునిగే
భూమిని గాచిన నారాయణ
స్తంభము వెడలి రక్కసు జంపి
డింభకు బ్రోచిన నారాయణ॥

వామనుండవై మూడడుగులతో
బలిని హరించిన నారాయణ
పరశువు బూని రాజుల గూల్చిన
భార్గవ రామ నారాయణ॥

ఇన వంశమున జనియించి రావణు
దునిమి సీతను ఏలిన స్వామీ
యదు వంశములో నుద్భవ మంది
కంసాది యసురుల కూల్చిన స్వామీ॥

బుద్ధ రూపమున వెలసి యహింసను
బోధించిన హరి నారాయణ
కలి యుగమ్ములో గిరిపై వెలసిన
కాంత కవినుతా నారాయణ॥

# 15

నిను చేర నే నెటుల రాగలను
శ్రీ వేంకట రమణ ఆపన్న శరణ॥

మనసు మాయ లనెడు ఉరుల
మరి మరి జిక్కిన యిత్తరి॥

కామ మోహ జాలములు కాంక్షలు నాలో రేపగ
పగ మద మను శత్రువులు పట్టి నన్ను ఊచగా
లోభ మత్సరమ్ములు నా లో సాగగ చెలరేగగ
ఎటుల నీదు రూపమునే కనుల తోడ చూడనేర్తు॥

యమ నియమ శమ దమములు
ఏ నెఱుంగ నైతి స్వామి
పూజ భక్తి యను పదములు
బుద్ధిలోన జొర వాయెను
ఎటుల నన్ను నీ దరికి
నీవే రప్పించెద వో
తిరుమలేశ కాంత వినుత
వరదాయక శ్రీనాయక॥

## 16

నరుని పైన నున్న దయ
నాపై నీ కేల రాదు॥

పరమ పురుష భేద బుద్ధి
చూపుట తగునా నీకు॥

కరమను రాగము తో సం
గర రంగము నందు నీవు
విజయుని రథ సారథివై
వెలసిన ఆ తీరెరుగనా॥

కర్మ భక్తి జ్ఞాన యోగ
మర్మములను నూరిపోసి
బెండు వడిన పార్థు గుండె
కండగ నిలచిన శ్రీహరి॥

భక్తునకు దేవునకు ఉన్న బంధ మెన్నడూ
తెగని దని నీకు నాకు తెలుసును ఓ వేంకటేశ
మరల మరల నైన పుట్టి తిరుమల గిరికేవచ్చి
నీ పదముల నాశ్రయింతు కాంత వినుత సుగుణ చరిత॥

## 17

ఎంత కరుణ కలవాడవో శ్రీ
కాంత లోల సుగుణ జాల॥

చింతలన్ని బాపి సకల
భువనములను ఏలు స్వామి॥

విషము తిన్న శితి కంఠుని
కాచ గంగ నొసగి నావు
విబుధలకు సుధను బంచి
ధర్మము రక్షించి నావు॥

మకరి బారి బడిన కరి
మనసు నిల్పి ఆర్తితోడ
హరి హరి యని పిలిచినంత
పరుగిడి కరి గాచినావు॥

నిండు సభా భవనమ్మున
పాండు సుతులు చూచుచుండ
వలువ లొసగి ద్రుపద తనుజ
మానమునే నిలిపినావు॥

కలియుగాన మమ్ముకావ
కరుణా పరతంత్రుడవై
వేంకటగిరి శిఖరమ్మున
వెలసిన శ్రీ కాంత వినుత॥

## 18

ఎక్కి వచ్చితిమి సోపాన పంక్తుల
నెన్నియొ నిన్ను చూడగ కోరి॥

చక్కని నీ దివ్య మంగళ రూపము
సందర్శించెడు భాగ్య మీయరా॥

తల్లియు తండ్రియు దైవము నీవని
ఎల్ల వేళల నిను మది నెంతుము
ఆపద లందున ఆదుకొందువని
ఆత్మలలో నిను నిలిపి నారము॥

కోరిన వరముల నిచ్చు దొరవు ము
క్కోటి వేల్పులకు నాయకుండవు
ఆర్తరక్షణా పరతంత్రుడవు
అని నమ్మితిమి శ్రీ వేంకటేశ॥

భక్తితోడ నీ నామ సుధారస
పానము చేసే ధ్యాన మీయరా
దేవ దేవ శ్రీకాంత వినుత వి
ఖ్యాత చరిత మునిలోక సేవిత॥

## 19

ఇలలోన నందరు నీకు బిడ్డలే
ఈ సత్యము మా కెఱుకయె స్వామీ॥

పలు రీతులలో పలువురు బుట్టిరి
అందరి జననము నీ లీలయే హరీ॥

కొందరు నీదు మాటల బుట్టి
వేద శాస్త్రముల వృద్ధి చేసిరి
కొందరు నీదు శౌర్యాన్వితులై
జనియించిరి ఈ ధర బాలింపగ॥

నీదు యోచనను కొందరు పుట్టి
నిస్తుల రీతి వ్యాపారులైరి
మరి కొందరు నీ యాన మేరకు
ధరను సస్య సుశ్యామల జేసిరి॥

మనిషి వృత్తి తన కులమును తెలుపును
మనిషి గుణము నిజ రూపము చూపును
మనిషి లోని రక్కసుడు మడిసెనా
మానవత్వమే వెల్లివిరియును॥

విమలమైన రూపమ్ము తోడుత
వెంకట గిరిపై వెలసిన స్వామీ
కుల విభేదముల రూపు మాపి మా
కలతలు తీర్చర కాంత కవి నుతా॥

## 20

ఎందరు నిను అర్చించిరో
ఇందిరేశ వేంకటేశ॥

అందరి డెందముల లోన
ఆనందము నిడిన స్వామి॥

కొందరు నిను గళమెత్తి
కొండ కోన మారుమ్రోగ
గోవిందా యని పిలిచిన
రక్షించిన శేష శయన॥

కొందరు స్వర రాగ భావ
తాళ గతుల నీ గుణములు
గాన మొనర్చిన వారికి
మోక్షము నొసగిన దేవా॥

అన్నమయ్య త్యాగరాజ
రామదాస కవివరుల
అంతరంగ మందు నలరి
అమర సుధను పంచిన హరి॥

నీ పదములె భవ తరణము
నీ నామమె యిక్షు రసము
నీ గానమె మధుర సుధా
పానము శ్రీ కాంత వినుత॥

## 21

హరిని దలంపుము అతడె బంధువు
అత డాత్మీయుడు నిన్ను గాచును॥

దురితము లెల్లను తొలగ జేసి నీ
జన్మకు సఫలత చేకూర్చు నతడే॥

పర దారలకు పర ధనములకు
ఆశపడి పెను గాసి జెందకు
పరి పరి విధముల పదవుల గోరి
నీతిని విడకు నెవ్వగ నందకు॥

కాలము కలసి వచ్చినదని లో
కాలను మోసము చేయ జూడకు
రవియూ చంద్రుడు కన్నులుగా గల
ప్రభువు నిన్ను వీక్షించు ననిశము॥

మాట లేల శ్రీ వెంకట గిరిపై
మా మనోహరుడు వెలసియున్నాడు
అతడె నిన్ను శిక్షించు రక్షించు
అనవరతము శ్రీ కాంత వినుతుడౌ॥

# 22

అలమేలు మంగమ్మ ఆదుకోవమ్మ నను
పిలచినా పలుకడు స్వామి యది ఏమో॥

కలికి నీ పదములే యిక నాకు కల దిక్కు
మరి ఎవరి తోడ నే మొర బెట్టు కొందు॥

ఒకసారి యైన నా వంక చూడడదేమి
నామాట వినడేమి దరి చేరనీడేమి
ఆర్తితో నా గుండెలో నుండి వచ్చెడు
గీతమును వినడేమి కినుక విడడేమి॥

వేద నాదము సేయ కమలజుడ నే గాను
మనసులో జపియింప నే మునిని గాను.
కలరవముతో పాడ నారదుండను గాను
కరుణించి చూడవే దాసాను దాసుడను॥

స్వామి నీ దరి చేరి సరస మాడెడు తరి
నీ నవ్వు వెన్నెలల తానమాడే వేళ
నా మాట చెప్పవే వగపాటు దీర్పవే
కాంత కవి వినుతుతో కావుమని జననీ॥

## 23

హరి హరి హరి హరి తిరుమల నాయక
వరదాయక సుర లోక నాయకా॥

పరమ దయాకర గోవర్ధన గిరి
ధర విశ్వమోహన దివ్యావతార॥

సకల మునిజన వందిత చరణ
నిఖిల రా త్రిచర దమన కారణా
శ్రిత జనావనా క్షీరాబ్ధిశయనా
ధృత పీత స్వర్ణ మంజుల వసనా॥

గంగా జనకా గరుడ తురంగా
భవ భయ భంగా దివ్యాంత రంగా
శ్రీ రమా మణీ హృదయాబ్జ భృంగా
రక్షిత దీన మదమాతంగా॥

ఆది దేవ విశ్వేశ మురారి
ఆది మధ్య రహితా ప్రమేయ శ్రీ
కాంత కవినుతా మంగళ చరితా
కంజజాది సుర సేవితా హరీ॥

## 24

అసురుల కందని అమృతమూ యిది
హరినామము దివ్యౌషధము॥

కొసరి కొసరి దోసిళ్ళ త్రావుడీ
క్షుధనూ వ్యధనూ మరచి పోవుడీ॥

వేంకటనాథుని వేల నామముల
మనసారగ పలు మారు బలుకుడీ
కమ్మని రాగ తాళ గతులలో
గళమెత్తి పాడుడి మెయి పులకరింప॥

పాలు వెన్న మీగడల కన్నను
ద్రాక్ష తేనియ జున్ను కన్నను
రసము చిప్పిలు చెఱకు కన్నను
మిన్నయైన దిది తెలిసికొన్నను॥

భక్తిలేని నరపశువు మనమ్ము
భయదారణ్యము రాక్షస సహితము
మానవత్వమే మరచిన వారికి
మందు గలదు శ్రీ వేంకట గిరిపై॥

సకల సురులు శ్రీ వేంకటేశు పద
సంభవమైన తీర్థము తోడ
గ్రోలు మందు ఇది కాంత కవివరుడు
కోకొల్లలుగా పంచెడు సుధయిది॥

## 25

వెడలి వచ్చె శ్రీ వేంకట నాథుడు
జనులకు కన్నుల పండుగ సేయ॥

పుడమి ఎల్లను పులకించి పోవగ
దిశలెల్ల వెల్గుల తేజరిల్లగా॥

సొగసుగ ముస్తాబయిన గరుడుని
మూపున అలమేలు మంగమ్మ శ్రీదేవి
తళుకు లీను క్రొమ్మెరుగు తీగలై
స్వామి వారి కిరు ప్రక్కల నలర॥

జలరుహాసనుడు నిగమనాదముల
స్వరయుతముగ గళమెత్తి వినిపింప
వాణి వీణ సవరించి నినదింప
వంది మాగధులు ప్రస్తుతి సేయ॥

సురులెల్ల వినువీధి చూచుచు నుండ
అచ్చరలు నాట్యమ్ము సేయగా
పరమ శివుడు నగరాజ కుమారియు
భరత నాట్యమును సేయుచు నుండ॥

ఇది భూలోకమ వైకుంఠమా యని
పదునాల్గు లోకాల వాసులెల్లరూ
అచ్చెరువున తిలకించు చుండగా
అలరిన శ్రీకాంత కవి వర్ణింపగ॥

## 26

ఎరుగరు నీ లీల బ్రహ్మాదులైన
నీకు నీవే సాటి లోకాలనేల॥

కరమరుదగు నీ చేతల తోడ
సురులను మునులను కాచిన స్వామీ॥

తెలివి మీరిన భస్మాసురుడు
వరములంది శంకరుని శీర్షాన
కరముంచి దహియింప జూచిన యంత
నెఱి మోహిని వై కాచిన స్వామీ॥

సురులు అసురులు జలధి ని జిలికి
సుధను బొంది భాగములు తేలక
పోరాడెడు తరి మోహిని రూపున
సుధ విబుధుల కిడి బ్రోచిన దేవా॥

ధర్మము చెడు తరి దగ్గర దూరము
అని చూడక రాక్షసులను దునిమి
కరుణ తోడుత త్రిదశుల గాచిన
కాంత వినుత శ్రీ వేంకట నాయక॥

## 27

నిను కనులారా కాంచి నంతనే
ఎందరి జననము సఫల మాయెను॥

వనజనాభ నీ పదము సోకిన
వారలు ముక్తిని కనిరి మురారి॥

నీ పాద రజము సోకిన రాయి
నిరుపమానముగ సుందరి ఆయెను
పాపము శాపము తీరిన ఆసతి
స్వర్గ ధామమే చేరెనురా హరీ॥

పడవ లోన నిను నీ సతి తోడ
భక్తి మీరగా నది యద్దరికీ
దాటించి గుహుడూ నీకు ఆప్తుడై
ధన్యుడాయెను దశరథరామ॥

ఒక్కొక్క ఫ లమును రుచి చూచి చూచి
చక్కని వన్నీ నీ కొరకు దాచి
మక్కువతో నీ కిచ్చిన శబరి
జన్మము ధన్యము జేసిన శ్రీహరి॥

వక్ర శరీరము తోనున్న కుబ్జను
ఒక్కసారి నీ కౌగిలి జేర్చి
చక్కని యందాల భామను జేసి
ఆనంద మిడిన నందకిశోరా॥

వక్రమైన నా బుద్ధిలోన నీ
చక్కని రూపము నిల్ప నీయరా
నీ పదముల భజియింప నీయరా
నిర్మల చరిత శ్రీ కాంత వినుతా॥

## 28

ఏమి చోద్య మిది ఏమి చోద్య మిది
వైకుంఠమునే వదలి వచ్చితివి॥

స్వామి నీకు ఈ కొండ కొనలో
చక్కని వేంకట గిరి నచ్చెనా హరీ॥

సిరియూ నీవూ ఏ కాంతముగా
ముచ్చటించుకొన నిచ్చట చేరిరె
నినుభక్త కోటి నిముషమైనను
వీడునె నీ కోర్కె తీరునే హరీ॥

పవళింప నిచట పాలసంద్రము లేదు
మెత్తని పాన్పుగ శేషుడు లేడు
పదునాల్గు భువనాల పాలించు స్వామి
ఎందుకు ధరపై వెలసితి వయ్యా॥

మనుజాలందు గల దనుజల జంపి
మహిని ధర్మమును నిలుప వచ్చితే
కరుణ జూపి మమ్మాదరింప రా
కాంత వినుత శ్రీ వేంకటేశ్వరా॥

# 29

కొలువై యున్నాడు శ్రీ వేంకటేశుడు॥

చెలువుగ తిరుమల మందిర మందున
జగదేక మోహన రూపము తోడ॥

రంగారు బంగారు పీఠము పైన
అంగన శ్రీదేవి అలమేలు మంగ
ఇరువంకల తన దరి చేరియుండ
కోటి సూర్య సంకాశ ప్రభలతో॥

శేషుడు చక్కని ఛత్రము బట్ట
గరుడుడు వింజామరముల వీవ
భక్త కోటులు గోవింద యనుచును
ప్రార్థన చేయగ కరుణా మయుడు॥

కమ్మనైన గీతముల బాడెడు
తుంబుర నారద మునుల గానమున
కలరి మురిసి ఆనందమందు శ్రీ
కాంత వినుతుడు గరుడ వాహనుడు॥

# 30

ఎంత చక్కని వాడే మా వేంకటేశుడు॥

కాంతు లీను నవ నీరద రూపుడు
ఆజాను బాహువు అరవింద నేత్రుడు॥

సకల భువనముల మోహింప జేయు
చెలువము గలవాడు చిద్విలాసుడు
చిరునవ్వు వెన్నెల కురియంచు వాడు
లోకాల నేలే మా పాలి దేవుడు॥

పచ్చని సరిగంచు పట్టు పుట్టము గట్టి
తీరుగ మోముపై తిరు చూర్ణమును బెట్టి
ఉరమున తులసి సరముల దాల్చి
అభయ హస్తుడై అలరారు వాడు॥

సిరిని నవ్వుల మురిపించు వాడు
అలమేలు మంగను అలరించు వాడు
భక్తుల మొర విని పరుగెత్తు వాడు
కరుణా మయుడు శ్రీ కాంత వినుతుడు॥

## 31

అన్ని మంత్రముల మించిన మంత్రము
శ్రీ వేంకటేశ్వర నీ నామము॥

అన్ని తపమ్ముల మించిన తపము
శ్రీనివాస నీ చరణ ధ్యానము॥

కనులుండి నీ దివ్య రూపము చూడని
వార లెల్లరూ అంధులు రా హరీ
కరములుండి నీ సేవ చేయని
వారల జన్మము వ్యర్థమురా హరీ॥

ఎదలోన నీ రూపు తిరముగ నిలిపి
నెమ్మది నీదు పదముల నుంచి
నిరతము రసనతో నీ నామమునే
స్మరియించు వారలు ధన్యులు రా హరీ॥

ఆది దేవ మా కండయౌదు వని
కొండ కోనలో నున్న నీ దరికి
చేర వచ్చితిమి కాంత కవి నుతా
శ్రీకర కరుణాకర మమ్మేలర॥

# 32

మేలుకో తిరుమల మందిరాంతర వాస
మేలుకో శ్రీహరీ శ్రీ వేంకటేశా॥

మేలుకో అలమేలు మంగా సమేత శ్రీ
లోల సద్గుణ జాల కరుణాల వాల॥

తూరుపు కొండపై తోయజాప్తుడు వచ్చె
దిశలలో నలమిన తిమిర సంఘము విచ్చె
పక్షి కులములు సేయు కల రవమ్ములు హెచ్చె
అంబుజమ్ములు విచ్చె నళులు ధ్వనియించె॥

సుమ సౌరభము తోడ గంధవహుడేతెంచె
వెదురు గోలలు వేణు నాదముల వినిపించె
క్రొన్ననల మాలలను కూర్చి తెచ్చిన సురలు
నిను చూడగా వేచి నిలచి యున్నారు॥

నారదుడు తుంబురుడు వీణలను సరిచేసి
సంకీర్తనము చేయ సంసిద్ధులైనారు
శంకరుడు పార్వతీ వాణీ విరించియు
నీ దర్శనము కోరి తారాడు చున్నారు॥

గోవింద గోవింద యని నీకు జేజేలు
భక్త కోటులు వచ్చి పలుకుచున్నారు
నీరేజనయన శ్రీ కాంత కవి సన్నుతా
నిఖిల లోకములేల మేలు కొనరా॥

## 33

సప్త గిరులపై వెలసిన స్వామికి
చక్కని కానుక లర్పించి వత్తము॥

అప్పుడతడె మన యంతరంగముల
అలరెడు చిన్మయ రూపుడతండే॥

మల్లెలు మొల్లలు తులసీ దళమ్ములు
మరువము జాజులు పారిజాతములు
కూర్చిన మాలల శ్రీ వేంకటేశుని
ఉరమున నుంచి సేవించుదాము॥

చక్కెర పొంగలి దధ్యోదనము
చక్కగ స్వామికి నైవేద్య మిడుదము
చక్కనైన పీతాంబర శ్రేణిని
స్వామికి కట్టి మురిసి చూతము॥

సప్త సుస్వరము లెసగు నట్టి రస
వత్తరంబైన గీత పంక్తితో
కాంత వినుతుడౌ శ్రీనివాసుపద
కంజములను భజియించి వత్తము॥

## 34

హరి నామమె మధురామృతము
హరి పద సేవే ముక్తికి పథము॥

హరి హరి హరి యని పిలిచినంతనే
అంతరంగమున అతడు నటించును॥

హరి పాదములే మునుల కాశ్రయము
హరియే సురలకు అభయ దాయకుడు
హరియే సకల చరాచర వితతిని
పోషించు వాడు రక్షించు వాడు॥

సాధు హృదయముల నిలిచిన వాడు
వేద నాదముల కలరిన వాడు
జగతిలోని ప్రతి అణువులోనను
భాసిల్లు వాడు అతడే అతడే॥

కొండ కోనలో వేంకట గిరిపై
కొలువు తీరిన శ్రీ వేంకటేశుడు
కరుణామయుడు కాంత కవి నుతుడు
అతడే శ్రీహరి పరమాత్మ అతడే॥

## 35

గోవిందా హరి గోవిందా
గోకుల నాయక పరమానందా॥

దేవాది దేవా నీ లీల లెల్లను
తెలిసి పొగడ నా తరమా ముకుందా॥

పసితనముననే రక్కసి పూతన
పాలు గుడిచి ప్రాణములు తీసితట
విశ్వము నెల్లను నీ నోటి లోన
తల్లి యశోదకు చూపి నావట॥

కాళీయుడనెడు ఫణి ఫణములపై
నృత్యము చేసి మర్దించి నావట
కొనగోటను గోవర్ధన మెత్తి
గోపకులమును రక్షించి నావట॥

మధుర మధుర మురళీ రవ సుధతో
వ్రేపల్లెలోని కన్నెల ఎదల
దోచినావట వెన్నెల రేల
రాచ కేళిని ఆడినావట॥

ఇలపై మమ్ముల కాచుటకై మా
ఇల వేలుపువై తిరుమల గిరిపై
నెలకొని యున్న కాంత వినుత న
న్నేలగ రారా శ్రీ వేంకటేశ్వరా॥

## 36

ఎందుల కయ్యా నీవు సృజించిన
మనుజాలు పెడదారి పోవుచుందురు॥

డెందము లోని నిను గన రేమి
తొందర పాటును విడనాడరేమి॥

సిరులు పదవులు సురభోగములు
మదిలోన కోరి నీతిని వీడి
మనుజాలు దనుజల వలె చరింతురే
మాధవ యిది చూచి ఊరకుందువా॥

నాల్గు వేదములు ఉన్న తెరంగున
నాల్గు వర్ణములు అని తెల్పితివే
ఇట్టి కులమ్ముల కుమ్ము లాటను
నీ వెపుడైనా తలచితివా హరీ॥

మోసము చేసి మూటలు గట్టి
అంతులేని ధన మార్జన జేసి
అందలి భాగము నీకు ముడుపుగా
అందింతురేమి ఎఱుగవా ఇది॥

ఆశాహెచ్చి లోకాల గ్రసియింప
అర్థమున్న మహరాజాలు వూనిరి
కాంత కవి నుతా ధర్మము నిల్పగ
సిరికి చెప్పరా వేంకటేశ్వరా॥

# 37

మేలుకోరా స్వామి మేలుకోరా హరీ
మేలుకో సప్తగిరి నిలయా దయామయా॥

మేలుకొని లోకాల నేలుకొను వేళాయె
నీల నీరద శ్యామ ఈ జాల మెలా॥

తూరుపు కొండపై దినకరుడు ఉదయించె
సరసిలో జలజములు నిను చూడ వికసించె
తెలవారె నని విహగ కులము లెల్లను లేచి
కల రవమ్ముల నీకు జేజేలు వచియించె॥

ఆదిలక్ష్మి దేవి అలమేలు మంగమ్మ
తెప్పించి రాకాశ గంగా జలమ్ము
సంపెంగా తైలమ్ము తో నీదు శిరమంటి
జలకమ్ము లాడింప నిలచి యున్నారు॥

ముక్కోటి దేవతలు విశ్వమోహన మైన
నీ రూపు చూడగా వేచి యున్నారు
ముల్లోకముల నుండి భక్తులెల్లరు వచ్చి
నీ దర్శనము గోరి చూచు చున్నారు॥

చిరు నవ్వులిక చాలు చాలింక నీ లీల
చిత్రమౌ గతులలో శయనింప జూడకు
శేష తల్పము వీడి శ్రీ కాంత కవి వినుత
జగమేల మేలుకో శ్రీ వేంకటేశ॥

## 38

ఎంతటి బ్రహ్మానందము రా శ్రీ
కాంత నిన్నుగని పెంచిన వారికి॥

సంతతమూ నీ మోహన రూపము
కన్నులారగా కన్న వారికి॥

కౌసల్య ఏమి పున్నెము చేసెనో
దశరథుడేమి తపమొనర్చెనో
ముద్దులు గుల్కు నీ మోమ్మును
ముద్దులాడి తరియించ గల్గిరి॥

గాధిసుతుడు గౌతముని యిల్లాలు
గుహుడూ శబరీ పవనసూనుడు
ఏమి పున్నెమును చేసినా రహో
నీకు ఆప్తులై నిలచిరి యిలలో॥

దేవకి వసుదేవులేమి సుకృతము
చేసినారో నిను బిడ్డగ కంటిరి
నంద యశోదలు ఏ నోము నోచిరో
నిను లాలించి పెంచ గలిగిరి॥

వ్రేపల్లె లోని గోపకన్నియలు
ఏ వ్రతము చేసిరో నిను డాయగల్గిరి
తొలి జన్మ ములో నీ మురళి ఏ పూజ
చేసెనో నిన్ను ముద్దాడ గల్గెను॥

మనసు లోని మమకారము తీరని
మాతృ మూర్తి వకుళమ్మ యింటిలో
పెరిగి కాంత కవి వినుత మూర్తివై
వెలుగు శ్రీహరీ వెంకటేశ్వరా॥

## 39

కనుల నిన్ను కనుగొన్న యంతనే
కలిగెను నాలో మధురానుభూతి॥

మనసులోని చైతన్యము సుధయై
మరిమరి నా యెద లోన పొంగెను॥

సుందరమైన నీ నెమ్మోమును
చూచినంత నా మేను పులకించె
ఇందిరేశ నీ మంద హాసమే
నా డెందములో నిలచి పోయెను॥

నీ నామమునే పలికి నంతనే
ప్రకృతి నెల్ల నే మరచి పోయితి
నీ పద సేవ చేసిన నాలో
వెలిగెను ఏదో ఆరని జ్యోతి॥

తెలిసి కొంటిరా ఈ విశ్వమంతట
దేవ దేవ నీ రూపమున్నదని
నాదమయా శ్రీ కాంత కవినుతా
నన్ను బ్రోవరా శ్రీ వేంకటేశ్వరా॥

# 40

వనధి లో అలలపై వటపత్ర డోలలో
పవళించు శ్రీహరి నీకు లాలి॥

మనసార కుడికాలి వ్రేలు నోటను జొనిపి
తీయగా నవ్వేటి నీకు లాలి॥

సాకేత పురములో చక్కనౌ డోలలో
కౌసల్య నిన్నుంచి కమ్మగా గళమెత్తి
జోల పాటలు పాడ నిదురించు శ్రీరామ
నీల మేఘశ్యామ నీకు లాలి॥

నంద గోకులములో ఆనందముగ నిన్ను
ఉయ్యాల లో నుంచి ఆ యశోద
కమ్మ నౌ గీతముల గానమ్ముసేయగా
నిదురించి కృష్ణయ్య నీకు లాలి॥

అఖిల జగములలోన పసిబిడ్డలందరీ
లోనున్న పరమాత్మ నీకు లాలి
నిఖిల జగముల నేలు శ్రీ వేంకటేశ్వరా
శ్రీ కాంతా కవి నుతా నీకు లాలి॥

## 41

నిద్దుర పోరా జోలాలి
నీరేజనయనా జోలాలి॥

ముద్దుల కన్నా జోలాలి
ముత్యాల మూటా జోలాలి॥

పాల కడలిలో ఫణిరాజుపైన
పవళించు స్వామి జోలాలి
విశ్వమనెడు ఉయ్యాల లోనను
ఊగెడు నీకు జోలాలి॥

వేద నాదమును విని మురిసి పోవు
వేదాంత వేద్యా జోలాలి
సామగానమున కలరెడు స్వామీ
చైతన్య రూపా జోలాలి॥

గగనాన నున్న నెలరాజు జూచి
కడలి కెరటమౌ స్వామి జోలాలి
తారకలను గని కేరింతలాడే
నీరద శ్యామ నీకు జోలాలి॥

మల్లెలు జాజులు పరచిన పానుపు
రచియించి నాను జోలాలి
మారాము సేయకు లోకాల నేలే
మహరాజ నీకు జోలాలి॥

అన్ని వేళల వేంకట గిరిపై
అలరారు స్వామి జోలాలి
తిన్నగ శ్రీ కాంత కవి ఊచు ఊయల
లోనున్న వనమాలి నీకు జోలాలి॥

## 42

స్వామి వేంకటేశ్వరా
సరగున నను బ్రోవ రార॥

ప్రేమ తోడ లోకాలను
పాలించే దేవ దేవ॥

ఆది దేవ కమల నయన
శ్రీదేవీ హృదయ రమణ
సకలామర వినుత చరణ
సర్వేశ్వర జలధి శయన॥

కోరనురా ధనరాసులు
కోరనురా భోగములను
కోరను నే పదవులను
కోరుదు నీ చరణ సేవ॥

మనిషి లోని మమత కరుణ
మటు మాయము అయ్యేడు తరి
మరల నీవు అవతరించి
మహిగాచెదవని నమ్మితి॥

ధర లోనను శాంతి నిలిపి
ధర్మము నెల కొల్పగా
వేగ రార కాంత వినుత
విమల చరిత వేదరతా॥

## 43

తిరుమల గిరిని దిగివచ్చు స్వామి
ఇంత రేయి నీ కేమి పని॥

విరిసిన వెన్నెల చూచుచు ఇలపై
విహరింప నీకు మనసాయనా హరీ॥

విరియ బూచిన తరులను లతలను
వీక్షింప నీమది కోరిక కల్గెనా
దివి నుండి భువికి పరువులు తీసెడు
ఝరుల చూడగా తలపు కల్గెనా॥

భక్తకోటిలో ఎవరైన గళమెత్తి
రారా శ్రీహరి యని పిలిచితిరా
ఎందుకు వడి వడి నడిచేవు స్వామి
ఈ తొందరేల నీ డెందములో॥

ముసి ముసి నవ్వులు నవ్వెద వేమి
ముంగురులను సవరింప వదేమి
ఎదలో పొంగిన మధుర భావముల
ఏవో పాటలు పాడెద వేమి॥

సిరి దరి చేరగ తీయు పరుగులా
అలమేలు మంగను అలరిపం నేగు
తొందరయా శ్రీ కాంత కవినుతా
తెలుపర నా మది పులకించి పోవ॥

# 44

వేదన బాపగ వేగమె రారా
వేదమయా శ్రీ వేంకట నిలయా॥

నాదమయా ఓంకార నినాదా
నందిత హృదయా హే దయామయా॥

ఆదిదేవ సురసేవిత చరణా
ఆర్తి హరణ భవసాగర తరణా
సకల లోక కళ్యాణా కారణా
సర్వ సురగణ మానిత సుగుణా॥

వారిధి శయనా నీరేజ నయనా
పతిత పావన భక్తజనావన
విశ్వమోహన సుందర వదనా
విలసిత శ్రీ సతి హృదయాబ్జ సదనా॥

మానవాకృతిని పూని రక్కసుల
నుక్కడంచి ధరపైన ధర్మమును
నిల్పిన స్వామీ కాంత కవినుతా
నీ పదములె మా కాశ్రయమ్మురా॥

## 45

భజ గోవిందం భజ వేంకటేశం
భజ శ్రీనివాసం శ్రితజన పోషం॥

అజ రుద్రాది వందిత చరణం
అనిమిషవైరి నాశకారణం॥

సామ నిగమజ సప్త సుస్వర
గాన సుధారస పాన విలోలం
సకల మునిజన పాలన శీలం
సర్వ సుపర్వ వినోదిత హేలం॥

కాలాతీతం కామాది షడ్రిపు
విజితం ఆగమ వినుతం పూతం
త్రిగుణాతీతం కాంతకవి నుతం
విశ్వ విఖ్యాత మహాద్భుత చరితం॥

# 46

కంటిని రా నీ మోహన రూపము
కంటిని రా నీ ధైర్యము శౌర్యము
కంటిని రా నీదు లీలా మానుష
విగ్రహ వేషము శ్రీ మనోహరా॥

ముని కను సైగను తెలిసి లీలగా
ముక్కంటి ధనువును విరిచే వేళ
జనక జాతను సిరి యని ఎత్తిగి
చక్కగా పరిణయ మాడే వేళ॥

వానర వీరుల నందర గూర్చి
వార్ధిపైన నొక సేతువు గట్టి
రావణాసురుని తలలను ద్రుంచి
రాజిల్లు వేళ శ్రీ రఘు రామ॥

సాకేత మందున పట్టాభిషేకము
జరిగెడు వేళ వాయుసూనుడు
నీ పదములను పట్టెడు వేళ
కాంత కవి నుతా శ్రీ వేంకటేశా॥

పరమాత్మా నీ లీలల నెల్లను
బ్రహ్మాదులైన వర్ణించ గలరే॥

చెఱలోన బుట్టి నంద గోకులము
నందున పెరిగిన గోవిందా॥

వ్రేపల్లెలోన యిల్లిల్లు దిరిగి
వెన్న ముద్దలను మనసార మ్రింగి
విశ్వము నెల్లను నోట జూపిన
గోపాల బాల మా పాలి దేవ॥

ఆల గాచుచు చల్దియన్నమును
ఆరగించి జడివాన తడిసెడు
గోవుల గాచగ గోవర్ధన గిరి
కేల నెత్తిన గోవ కిశోరా॥

వెన్నెల రేల యమునా తటిలో
కన్నియ లెల్లరు నీ చెంత చేరి
వేణు గానమును విని మురిసి రటి
రాచ కేళిలో తనిసి నారట॥

అలమేలు మంగమ్మ అందాలు చూచుచు
సిరితల్లి తోడ సరసాల నాడుచు
సురలోక భోగాల వేంకట గిరిపై
పరవశించు శ్రీ కాంత కవినుతా॥

48

కన్నులార నీ దివ్య రూపమును
కంటినిరా నే దేవాది దేవ॥

ఎన్న దరమె నీ లీలలు శ్రీహరి
ఇభరాజ పాల కరుణాల వాల॥

ఫెళ ఫెళార్భటుల స్తంభము వెడలి
భయదమైన నరసింహ రూపమున
కనక కశిపుని వక్షము జీల్చి
ప్రహ్లాదు గాచిన శ్రీనారసింహా॥

వానర సేనతొ లంకను జేరి
ఘన కార్ముకమును చేతను బూని
దశకంఠు శిరములు నేలను గూల్చి
తరుణి సీత చెర బాపిన రామ॥

కంసాది రాక్షస వీరుల జంపి
కరుణ మీర గోకులమును గాచి
సుమధుర లలిత వేణు గానమున
సుధలను పంచిన గోపకిశోరా॥

శ్రీదేవి యలమేలు మంగమ్మ తల్లి
చెలువుగ నీతో శేషశైలమున
ఆటల పాటల నలరారు చుండ
ఆనంద మందే శ్రీ వెంకటేశ్వరా॥

ఇలను ధర్మమును నిలుపగ గోరి
ఎన్ని రూపముల దాల్చినాడవో
అన్నియు జూచితి కాంత కవినుతా
అఖిల లోక కళ్యాణ కారకా॥

## 49

వనజ నయన మా యింటికి వచ్చి
నిలుపుమురా నీ నిజరూపముతో॥

తనవి తీరదు నిన్నెన్ని మారులు
దర్శించినను శ్రీ వేంకటేశ్వరా॥

రమ్యమైన అపరంజి పీఠమును
తెచ్చివేయగా జాలనుగాని
చక్కని మృణ్మయమైన అరుగును
స్వామి నీకు నే నిర్మింప గలను॥

స్నానము సేయింప గంగా జలమ్ముల
సురకోటి వోలె నే కొని రాలేను
మా యింట నున్న మంచి నీటితో
చక్కగ నిన్ను జలకము లాడింతు॥

పట్టు పుట్టముల పీతాంబరముల
ఘనముగ నీకు కొని తేలేను
సాలెలొ మాలలో నేసిన మంచి
నూలు దొవతిని నీకర్పింతు॥

చక్కెర పొంగలి దధ్యోదనము
నిరతము నీకు చేయింప జాలను
కలియో గంజియొ మాతో పాటు
ఆరగించ మని నిన్నర్థింతు॥

పట్టుపరుపులు పారిజాతములు
పరచిన పానుపు రచియింపలేను
దొరకిన పూవుల ఆకుల గూర్చి
మెత్తగ నీ శయ్యనే విరచింతు॥

అలమేలు మంగకు సిరికీ దయతో
నామాటలన్నీ ఒక మారు చెప్పి
సకుటుంబముగా మా వేలుపువై
వెలయుమురా శ్రీ కాంత కవినుతా॥

# 50

పరాకేల నయ్యా నీకు
పరమ పురుష వేంకటేశ॥

నిరానంద హృదయుడవై
నిలిచినా వదేమి స్వామి॥

పరిపరి విధముల ధనముల
మూటల నర్పించు వారి
కథలను మదిలోన తలచి
కలత చెందు చుంటివా॥

అలమేల్మగను పరిణయ
మాడెడు తరి ధనదు వద్ద
కొని వచ్చిన ఋణము వృద్ధి
గణన సేయుచుంటివా॥

శేషుడు విహగేంద్రుడు నీ
సేవలనే మానితిరా
సిరియలమేల్మంగలు నిను
దూరముగా నుంచితిరా॥

ఎల్ల జీవ జాలమును
ఏలెడు ఓ పరమాత్మా
మధన వీడి నా మొర విని
కావరార కాంత వినుత॥

## 51

నిను కనులారా కాంచిన వారలు
ఎంత ధన్యులో శ్రీ శ్రీనివాసా॥

తనివి తీరగ నీ మాటలను
వినిన వారలే పున్నెము జేసిరా॥

ఆ అయోధ్యలో ఉన్న జనావళి
ఆ అహల్యయు గుహుడూ శబరి
అ హనుమంతుడు ఆ విభీషణుడు
ఏ తపము చేసిరొ నిన్నర్చించిరి॥

వ్రేపల్లె లోని గొల్లవారలు
నీ చెలిమి చేయ ఏనోము నోచిరొ
నీ వేణు నాదము విని పులకింపగ
వారేమి వ్రతము జేసినారలో॥

మరు జన్మనైన నను నీదు పాద
మంజీరముగా వెలయగ జేసి
అనిశము నిన్ను అర్చించు భాగ్యము
కలుగ జేయరా శ్రీకాంత వినుతా॥

# 52

ధృతి యన్న నీదే ఆకృతి యన్న నీదే
అర్జున రథ సారధి వైన స్వామి॥

కృత పుణ్యుడైన ఆ గాండీవికి
గీతోపదేశము చేసిన దేవా॥

రణరంగ మందున నిలచిన కవ్వడి
బంధువులను గని కలత చెందుతరి
రాజధర్మము శత్రువినాశన
మని తెల్పి ధృతినిల్పి నట్టి మహాత్మా॥

గంగా తమాజాడు తేరుపై నిలిచి
సంగర మొనరించు సమయమునందున
భరియింప లేక సర్వము మరచి
చేత చక్రమును పూనిన శౌరీ॥

శరణన్న వారల రక్షించుటలో
నీకు నీవే సాటి శ్రీ వేంకటేశ
ధరపైన ధర్మము నిలుప వేమిరా
కమలా మనోహరా కాంత కవినుతా॥

# 53

కన్నులార శ్రీ వెంకటేశుని
కళ్యాణమును చూడగ రండి॥

జన్మ తరించును హరినీ సిరినీ
అలమేలు మంగను చూచిన వారికి॥

తిరుమల గిరిపై ఆకాశమంత
పందిరి వేసి సురలు మునులు
వరుసలలోన ఆసీనులై యుండి
వేడుక చూడగ వేచియున్నారు॥

ముద్దులు గులుకు సిరినీ మంగను
ముస్తాబు చేసిరి ముచ్చట తీరగ
వద్ద జేరిన వాణీ పార్వతి
వరసాడు చున్నారు మురిసి చూచుచు॥

స్వామికి కొందరు జలకములాడించి
బంగారు రంగు పట్టుపుట్టమును
కట్టి నుదిటిపై కస్తూరి తిలకము
పెట్టి చూచి ఆనంద మందిరి॥

ముత్యాలు గూర్చిన పీటలపైన
ముువ్వురినీ కూర్చుండ బెట్టిరి
సిరియు మంగయు సిగ్గు లొలకగా
శ్రీహరి వారిని చిలిపిగ చూచెను॥

మంగళ గీతము లాలపించిరి
మంత్రములను బ్రహ్మాదులు చదివిరి
గళములలోన సిరికీ మంగకు
కట్టెను హరి మంగళ సూత్రములు॥

దేవ దుందుభులు తూర్య నాదముల
తోరముగా మ్రోయించు చున్నారు
ముత్యాల తలబ్రాలు పోసుకొనెడు ఆ
ముువ్వురిని దర్శించగ రండీ॥

పాయసములతో పక్వాన్నముతో
పంక్తి భోజనము పెట్టుచున్నారు
విబుధు లెల్లరు వడ్డించు చున్నారు
వేగమె రండీ ఆరగించగా॥

అచ్చర లెల్లను మది పులకింపగ
ఆడుచున్నారు తుంబుర నారద
గాయక వరులు గానము తోడ
రసహృదయులను రంజించు చున్నారు॥

ఇంత కన్న ఇక బ్రహ్మానందము
ఎక్కడున్నదని యోగు లెల్లరు
తలచి మురియు చున్నారు కాంత కవి
వినుతుని తాదాత్మ్యము తోడ చూచుచు॥

## 55

ఎంత కరుణ కలదో నీ కంటి చూపులో
ఎంత దయా రసమో నీ ఎడదలోన వేంకటేశ॥

సంతతమును మందహాస మధుర సుధల చెలువారే
నీ మోమున చెలగు కృపయె నిరుపమాన మోహరీ॥

ప్రకృతిలోని ప్రతి ప్రాణికి
అన్నమొసగి నీర మొసగి
ఆపదలో కాపాడి
ఆత్మీయత తోడనీదు
అనురాగము పంచి యిచ్చి
అభయ హస్త మొసగు నీ
కనికర మది ఏమిరా
ఎంత కన్న తీపిరా॥

సప్తగిరుల పైన వెలసి
సకల జనుల కాప్తునిగా
మెలగే శ్రీ కాంత వినుత
జాలమేల మమ్మేలగ॥

56

మంగళము శ్రీ హరికి మంగళము సిరికి
మంగళము అలమేలు మంగమ్మ తల్లికి॥

రంగారు బంగారు సప్తగిరి శిఖరాల
రాజిల్లు శ్రీ వేంకటేశునకు మంగళం॥

తనలోన జగములను దాచుకొని రక్షించు
సర్వలోకేశునకు మంగళం మంగళం
కరుణతో జనులకు సిరులొసగి రక్షించు
శ్రీదేవి తల్లికి శ్రిత మంగళం॥

జగమేలు తనస్వామి అలసి యున్న వేళ
అలరించు అలమేలు మంగకు మంగళం
కలియుగమ్మున ధర్మ రక్షణ మ్మొనరించు
కాంత కవి వినుతునకు మంగళం మంగళం॥